


## ప్రభుత్వ విద్యా మహాసభ

గత సంచికలో మేము అధ్యక్షుల వారి యుపన్యాసములు వారికి పరబాపై గల ప్రాచీనాభి ప్రాయమును విమర్శించి యుంటిమి. వీరు చాల మొగలాయి మనుష్యులని వెల్లడి యయ్యెను. వీరి యుపన్యాసములో క్రొత్తవిషయములేవని వీరే సెలవిచ్చి యున్నారు. మేమును నదేమాట చెప్పుచున్నాము. వీరు నిష్పక్షపాతముగా విమర్శించి యిటీవల పత్రికలలో ఉస్మానియా విశ్వవిద్యాలయమును గురించి వెలువడిన వాదోప వాదములను చర్చించినవారు కాకపోయిరి. తుదకు ఇస్లామిక్ పత్రికలో వేసిన ప్రశ్నలకైనను జవాబిచ్చిన పాపమునకు పోయినవారు కారు. ఉస్మానియా విశ్వ విద్యాలయములో దేశభాషా రూపమున విద్యచెప్పుట లేదు. ఉర్దూ దేశభాషకాదు. ఉర్దూ కన్న ఇంగ్లీషే మేలైనమార్గము. అని యనేక విమర్శనములు బయలుదేరి యుండెను. కాని మా ప్రొఫెసరుగారి వన్ని విమర్శనీయాంశములు కావని కండ్లుమూసికొనినట్లున్నది, లేక తమ మాతృభాషకు ప్రాధాన్యము తగ్గునని చింతించియుందురు.

ప్రొఫెసరుగారు గ్రంథాలయముల ను గురించి యొక్కమాట సెలవిచ్చియుండిరి. గ్రంథాలయములద్వారా విద్య వ్యాపించునని వీరివాదు గుర్తించిరి. సుమారు ౧౦ సంవత్సరములనుండి మన హైద్రాబాదు రాష్ట్రములో నేటిఆంధ్రులు సుమారు ౧౦౦ గ్రంథాలయములనుస్థాపించియుండిరి. కాని ప్రభుత్వము వాటిట్టి గ్రంథాలయములపై నిర్బంధముగ నేర్పాటుచేసిరి మరియు మా. రహబరుగారు ఈగ్రంథాలయములు రాజద్రోహస్థానములని తెలివితక్కువ మాటలతోకట్టిన దినపత్రికలో వ్రాసికొనిరి. మా ప్రొఫెసరుగారైన వారికి బుద్ధి చెప్పగలరు. ప్రైమరీ విద్యావిధానములో మార్పుచేయవలెనని మా ప్రొఫెసరు గారు సెలవిచ్చిరి. కాని యెట్లుచేయవలెనో మాటలేదు. సాధారణముగా గ్రామములలో ప్రైమరీ పాఠశాలలలో ౨ వ తరగతినుండియే ముసల్మానులు కానివారలు కెల్లరును ఉర్దూ చదువవలెను. రెండవతరగతివరకు చదివిన ముసల్మాను బాలునితో పహాయ పాఠ

శాని హిందూబాలు డేమి పోటీకి నిలచును, నిలువలేక పారిపోవును. ఇంక ప్రైమరీవిద్య అభివృద్ధికావలెననిన యెట్లగును. అందుకొరకే ప్రజాపక్ష మహాసభలో నేము జోగిపేట మహాసభలోనేము సభవారు విద్యాపరిస్థితులను పరీక్షించుటకై యొక కమిటిని నేర్పాటుచేయుటకై ప్రభుత్వమువారిని ప్రార్థించియుండిరి. కాని యవన్నియు చెవిటివాని చెవిలో శంఖువట్టి యూదినట్లైనవి. చెప్పవచ్చుగాదు, మాది అరణ్యరోదనము. ఉన్మత్తప్రలాపములుగా భావింపబడుచున్నవి. కాని యెంతవరకైతే ప్రైమరీపరిస్థితులలో సరియైన మార్పుకాదో యంతవరకు మా ప్రొఫెసరుగారి వంటివారు వేలకొలది అధ్యక్షకార్యములను మధించి కత్తిన నోరుపెట్టు కొని చెవులు చిల్లులుపోవ అరచినను కించిత్తైనను లాభము లేదని మనవి. ఈ సభావిషయములను గురించి వీలున్నచో నింకొకసారి చర్చింతుము.

### సరోజినీదేవిగారి నిర్బంధము

సరోజినీదేవిగారు హైద్రాబాదునందు జనించిన వీరనారీమణియని ఎల్లరు ఎరిగిన విషయమే. వీరు కేవలము చిన్నప్రాయమునుండియే తమ మేధాశక్తి నిజూపి ఎల్లరుల మెప్పును బడసిరి. వీరు హిందూదేశమున కొసర్చిన సేవ అపారమైనది. అట్టివారు నేడు కేవలము దేశసేవ జేయుటవల్ల కారాగృహమునకు పోవలసి వచ్చినప్పుడు వీరిని అభినందింపనివా రెవరుండిగలరు?

సరోజినీదేవిగారు మొదటి నుండియు తన జీవితము దేశసేవయందే గడపిరి, అందుచే వీరి సేవకు మెచ్చి హైందవులు వీరిని కాంగ్రెసు అధ్యక్షురాలుగాగూడ నొక సంవత్సరము నెన్నుకొనిరి, హైందవస్త్రీలలో ఇప్పటికిని ఉన్నత స్థానము నలంకరించినవారు వీరొకరే. తరువాతగూడ దేశసేవాతత్పరులై అమెరికాఖండమునకు వెళ్ళి మిస్ మేయోగారు వ్రాసిన "మదర్ ఇండియా" గ్రంథమువల్లజరిగిన దుష్ప్రచారమును తమ వాక్చాతుర్యముతో నణంచివేసిరి. అక్కడనున్న అరునెలలును వీరు హిందూదేశమునకై చేసినకృషి అపారము, వీరి కృషిని మెచ్చుకొనియే వచ్చిన కొన్ని దినములలోనే వీరిని భారత మహిళా మహాసభ కధ్యక్షురాలుగా నెన్నుకొనిరి. తరువాత గాంధీగారి ఉద్యమము రాగానే దానియందు హృదయపూర్వకముగ పాల్గొని ఆతని మన్ననబడసి తుదకు వారి తదనంతరము అదే ఉద్యమమునకు నియుతగా నియమింపబడిరి. ఇట్టి నియత పదవియందుండగ వారుచేసిన కృషి పత్రికా పాఠకుల కెల్లరకు విదితమే. ఇపుడు వీరికి దేహ మనస్వస్థతగ నున్నదని తెలియుచున్నది. కాబట్టి ఇట్టి భారతనారీరత్నమునకు ఇంక నినుమడింతలు దేశసేవ నొనర్చుటకై భగవంతుడు చిరాయురారోగ్యము నిచ్చుగాతి!

### కృష్ణాపత్రిక

ఆంధ్రపత్రిక పాఠక మహాశయులలో కృష్ణాపత్రిక నెరుగనివా రరుదు. ఈ ఆంధ్రపత్రిక ఇప్పుడుండు ఆంధ్రపత్రికల కన్నిటికన్న వయసునందు పెద్దదని చెప్పవచ్చును. ఈ పత్రిక కేవలము రాజకీయములందేకాక భాషాభివృద్ధికిని జేసిన కృషి అపారము. ఆపత్రిక చేసినకృషికి మెచ్చియే మన ఆంధ్రులు దీనికి అద్వితీయమైన సన్మాన మొసగిరి. అట్టిపత్రిక ఇప్పుడుండు రాజకీయ పరిస్థితులవలన గలిగిన పత్రికా శాసనమువల్ల ఆపబడినదని విన్న చింతను వెలిబుచ్చని ఆంధ్రులుండరు. ఆపత్రిక ఆగడమువల్ల కేవలము ఒక రాజకీయములకేగాక భాషాభివృద్ధికిని తీరని లోటు గలిగినదని చెప్పవచ్చును. కాబట్టి ఈ పత్రిక ఆలోటును మాన్పుటకై తిరిగి ద్విగుణీకృతమైన ఉత్సాహముతో త్వరలో వెలువడునని నమ్ముచున్నాము!

## గ్రంథ స్వీకారము

నిరోష్ఠ్య నిర్వచన శుద్ధాంధ్ర హరిశ్చంద్రోపాఖ్యానము- గ్రంథకర్త పోకూరి కాశీపతిగారు.

ఈ గ్రంథము గుంటూరుమండల నివాసస్థులగు పోకూరి కాశీపతిగారిచే రచియింపబడి కీ॥ శే॥ గద్వాలప్రభువు వారి కంకిత మీయబడి గద్వాల శ్రీమహారాణిగారిచే నాదరింపబడి యున్నది. ఈ గ్రంథము గద్వాలలోనే అచ్చైయున్నది. ఈగ్రంథమునకు శ్రీ సూర్యవేంకటాచార్యుల వారు ఉపోద్ఘాతమును వ్రాసియున్నారు. ఇట్టిగ్రంథము విమర్శనార్థమై మాపత్రికకు పంపబడియున్నది.

మేమీ గ్రంథము నచ్చటచ్చట చూచినారము. శైలి చాల కఠినము. సాధారణముగా పండితులకును సర్వము కాదు. గ్రంథకర్తగారి పరిశ్రమను జూడ మాకాశ్చర్యము కలుగుచున్నది. ఈకాలములలో నిట్టిగ్రంథములను జదువు పాఠకులొకరే యుండరు. గ్రంథకర్తగారు నామములనుగూడ నచ్చతెనుగులోనికి పరివర్తింపజేసిన ప్రయత్నము తమ నియమానుకూలముగ నుండినను బాగుగా గనబడదు. హరిశ్చంద్రుని అరిచ్చంద్రుడనియు అదిలక్ష్మిని అదిలచ్చి యనియు కృత్తికర్తలగు సీతారామ భూపాలుగారిని "సీతగల్గు నీతెలిక జీరు నట్టల రహించగ నోగడ" యని యెంతొ యో ప్రయత్నముతో ఓష్ఠ్యములను తప్పించుకొని వ్రక్కణించినారు కాని పాఠకులను మాత్రము పెద్దగుంతలో త్రైచి దిక్కులు జోచునట్లుగా చేసినారు. పలువ సీరహాస్యము తెలియని వారు "సీతగల్గు నీతెలిక" యనునేమియో యర్థము చేసికొనజాలరు.

ఇట్లు కఠిన నియమబద్ధులగుటచేతను శబ్దాలంకారములను విశేషముగా పాటించుటచేతను. గ్రంథము ప్రౌఢముగను, పండిత జనైక వేద్యముగను నున్నది. ఈగ్రంథకర్తగారి కులము విశ్వబ్రాహ్మణకులము. కృతిభర్తగారికులము క్షత్రియకులమని వారి వియ్యంకులు అగు శ్రీ దోమకొండప్రభువులుగారు సప్రమాణముగా నిరూపించి వ్రాయించినారు. అయితే మన కవిగారు తమ కృతిభర్తను క్షత్రియునిగా వర్ణింపనేలేక.

"అద్దిరతో లనుండి యురా
కద్దియరుక డొంకయునగ గడలుకొ
సంగిక
దద్దయు రెడ్డిలుడురా
గద్దెలతిరన్ను జాగశాంభ్రినకేళి"

అని వర్ణించినారు. ఇక్కడ నోడమాద వెల్లిపోవ వర్ణించినను వీరి నిజమైన యభిప్రాయము రెడ్డి శూద్రులనియే. ఎట్లన

గీ॥ నీల తెలిగంటులార దుసీకులార
యల్యలకు డిగుదల జాతియయ్యలార
రెడ్డియొక్కటులార తరీకినారు
జోటికను రూకలిచ్చి యుజోక గానరె

అని హరిశ్చంద్రుడు తన దాసత్వ మమ్ముచు శూద్రులను సంబోధించుచు "రెడ్డి యొక్కటులార" అని సంబోధించెనట.

తలకట్టువద్యము

ఆ॥ అనగదసకట కరయగ తడయకజక
నచట గనలక వతదడలగ గడ
గడవడ వలసట దగదనరగ గడక
నగసనచనట గెలయగనదలచ॥

వీరపాది

ఉత్సా॥ నాయడాని గానసేన నాతుల
రిఖాడుగా॥

(ఇష్టేతక్కిన మూడుచరణములు)

ఈ గ్రంథమందు గ్రంథకర్తగారి కవిత్వము కన్న పాండిత్యమే హెచ్చుగా ప్రకటింప బడియున్నది. ప్రాగీన కవులగు కవిత్రయము, ...
తన, జక్కన్న మారన, మ...
గు కవులను శబ్దాలంకారా...
కే పోయినవారు కారు అ...
త్తమ కవిత్వమార్గ మనియు
రింజక మనియు సూచించు చు

---

గోలకొండ పత్రిక.
త్రూపు బజారు హైద్రాబాదు దక్కన్.

| | | |
|---|---|---|
| సంవత్సరము చందా రు. | | ౭—౦—౦ |
| అర్థ | ,, ,, | ౩—౧౨—౦ |
| విడి పత్రిక | | ౦—౧—౮ |

Printed and Published by G Ramakrishna Reddy at Golkonda Power Press, Hyderabad, Dn. Editor K. Balakrishna Reddy.